# గుర్వష్టకము–10

## శ్రీ శంకరాచార్యులవారు

గురోరష్టకం యః పఠేత్ పుణ్యదేహీ
యతిర్భూపతిర్బ్రహ్మచారీ చ గేహీ
లభేద్వాంఛితార్థం పరంబ్రహ్మ సంజ్ఞం
గురోరుక్త వాక్యే మనోయస్య లగ్నమ్.

తా॥ సన్యాసిగాని, రాజుగాని, బ్రహ్మచారిగాని, గృహస్థుడుగాని ఎవరైనప్పటికిని ఈ గుర్వష్టకమును పఠించుచో అతడు పుణ్యాత్ముడే కాగలడు. గురూపదిష్టమగు వాక్యమందు లగ్నమైన మనస్సు కలవాడై అతడు బ్రహ్మమనబడు సర్వోత్తమమగు వాంఛితార్థమును బడయగలడు.

వ్యాఖ్య :– ఈ శ్లోకమునందు గుర్వష్టకము యొక్క ఫల శ్రుతి చెప్పబడినది. ఈ గుర్వష్టకమును శ్రద్ధతో పఠించి ఆచరించువారు, ఎవరైనప్పటికిని పుణ్యమును, జ్ఞానమును పొందినవారై గురూపదిష్ట మార్గమున జని పరమాత్మ సాక్షాత్కారమును పొందుచున్నాడు.

ఇతి శ్రీమచ్ఛంకరాచార్య విరచితం గుర్వష్టకం సంపూర్ణమ్.

ఓం




సంపుటము : 24 ఏప్రిల్ 1992 సంచిక 4



చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా నంబరు తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో వచ్చు 'వేదాంతభేరి' కవరుపై యుండును.

# వేదాంతభేరి

**అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక**

[illegible]

## విషయసూచిక



**: ముఖచిత్రము :**

సిద్ధలక్ష్మి! మోక్షలక్ష్మి! జయలక్ష్మి! వరలక్ష్మి! శ్రీ మాతా!
అష్టలక్ష్మి స్వరూపిణీ! శ్రీ మహాలక్ష్మి!
నమోనమస్తే!

# ప్రార్థన



## రామ ప్రార్థన

రామ స్సీతా సమేతో నివసతు హృదయే సానుజం రామ మీడే
రామేణ క్షీణపాప స్త్రివిధమపి కృతం కర్మ రామాయ దద్యామ్।
రామాదన్యం న జానే నహి కిమపి మహోరామనామ్నస్సమానం
రామే పశ్యామి విశ్వం భువనమనుదినం పాహిమాం రామచంద్ర॥

సీతాసమేతుడగు రాముడు నా హృదయమున నివసించుగాక! సోదర సహితుడగు రాముని నేను నుతించుచున్నాను. రామునిచే నేను పాపరహితుడనైతిని. మనోవాక్కాయములచే నేను చేసిన కర్మను రామునకే అర్పించెదను. రామునికంటె అన్యమైనదానిని నేనెఱుగను. మహత్తరమైన రామనామముతో సమానమైనది ఏదియును లేదు. ఈ ప్రపంచమునంతయును ఎల్లప్పుడు రామునియందే చూచుచున్నాను. ఓ రామచంద్రా! నన్ను రక్షింపుడు!

(11.4.92 తేది శ్రీరామనవమి)



# వివేకానంద శంఖారావము



I direct my attention to the individual to make him strong, to teach him that he himself is divine, and I cell upon men to make themselves conscious of this divinity within.

వ్యక్తిని బలవంతునిగా, శక్తివంతునిగా చేయుటయే, అతడు దైవస్వరూపుడే అని బోధించుటయే నా ఉద్దేశ్యము. అకార్యమందే నేను నా దృష్టిని కేంద్రీకరించుదును. తమలో వెలయుచున్న దివ్యత్వమును సాక్షాత్కరించుకొనుడనియే నేను జనులకు ఉద్బోధించును.

వేదాంతభేరి



# శక్తివంతమైన కవచము

## శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



దేవరాక్షస సంగ్రామసమయమున దేవతలకు విజయము లభించు నిమిత్తము దేవపురోహితుడగు విశ్వరూపుడు ఇంద్రునకు నారాయణ కవచమును ఉపదేశించెనని భాగవతము షష్ఠస్కంధమున పేర్కొనబడినది. నారాయణ కవచ ప్రభావముచే ఇంద్రుడు రణమందు విజయశ్రీని చేబట్టగల్గెను. దానవులు భయభీతులై పలాయనమును చిత్తగించిరి.

కవచధారణ యోధులకు అత్యవసరము. శత్రువుల ఆయుధ ప్రయోగములనుండి, ఆఘాతములనుండి కవచము దేహమును సంరక్షించును. భౌతిక కవచములకే ఇంతటి అమోఘశక్తి యున్నపుడు ఇక ఆధ్యాత్మిక కవచమును గూర్చి వేఱుగ చెప్పవలయునా? విశ్వరూపుడు దేవేంద్రునకు బోధించినది ఆధ్యాత్మిక కవచము. దానినే నారాయణ కవచమందురు. ప్రతివారును ఇట్టి పరమార్థ కవచమును ధరించియే లోకమున వ్యవహరించవలసియున్నారు.

జీవుడు అనాదికాలమునుండి ఒకానొక భీషణసంగ్రామములో పాల్గొనుచున్నాడు. ఏ యుద్ధమైనను కొలది రోజులలో సమాప్తమైపోవును. కాని జీవుడు తగుల్కొనిన ఈ ప్రకృతి సమరము అనాది కాలమున ప్రారంభమై ఇంకను తెమలకయున్నది. కామక్రోధాది శత్రువులతో అతడు ఎడతెరపిలేక పోరాడుచున్నాడు. దేహభ్రాంతి, దేహాభిమానము, అహంకార, మమకారములను ప్రతీపశక్తులతో జీవుడు అనవరతము పోరు సల్పుచున్నాడు.

శత్రుపక్షము మహాశక్తివంతమై యుండుటఁబట్టియు, స్వపక్షమున తగినంత బలము లేకుండుటఁబట్టియు జీవుడు ఈ ప్రకృతి సంగ్రామమున విజయము గాంచలేకున్నాడు. పైగా శత్రుప్రహారములచే నానాబాధల నొందుచున్నాడు.

ఇట్టి స్థితిలో జీవుడు తన్ను తాను సంరక్షించుకొనుటకై ఏదియో విధముగ యత్నము సలుపవలసియున్నది. ఇందులకు కవచము చక్కగ ఉపకరించును. లోహములచే నిర్మితమగు కవచము కాదు. దైవకవచము, ఆత్మకవచము, నారాయణకవచము. భౌతికకవచము భౌతిక దేహమునే సంరక్షించునుగాని మానసిక బాధలను అది ఏ మాత్రము తొలగింపజాలదు. భవదుఃఖమును బాపుటకు ఆత్మకవచమే శరణ్యము. నానావిధ కల్లోలములతో గూడిన ఈ సంసార రణక్షేత్రమున జ్ఞానకవచమును ధరింపనిదే, దైవకవచమును ఆశ్రయింపనిదే జీవుడు శాంతిని నోచు కొనలేడు.

'రక్తమాంసములతోగూడిన ఈ క్షణిక దేహమును నేను కాను, దేహసాక్షియగు ఆత్మయే నేను' అని నిరంతరము భావించుటయే కవచ ధారణయగును. 'నాలుగుమూరల చిన్న అస్థిపంజరము నేను కాదు విశ్వ వ్యాపక ఆత్మయే నేను' అని సతతము సంస్మరించుటయే దైవకవచమును పరిగ్రహించుట యగును. 'పుట్టుచు, చచ్చుచు కర్మాధీనమై అస్వాతంత్ర

మైయున్న ఈ ఉపాధి నేను కాదు. జననమరణరహితమై, సర్వస్వతంత్రమై దేశకాల క్రియలకు ఒకింతైనను సంబంధములేని నిర్వికల్పచిదాత్మయే నేను' అను పరిజ్ఞానము కలిగియుండుటయే బ్రహ్మకవచమును ధరించుట యగును.

ఇట్టి ఆత్మకవచమును, దైవకవచమును ధరింపనివానికి ఈ సంసారక్షేత్రమున దెబ్బలు తప్పవు. దుఃఖము తప్పదు. బాధ తప్పదు. ఎందఱో సత్యమునెఱుగక, తమ నిజాత్మభావమును మఱచి ఈ దెబ్బలు తినుచు, బాధలు పొందుచు సంసార భారమును ఈడ్చుకొని పోవుచు జీవయాత్రను కొనసాగించుచున్నారు. దుఃఖముచే కుమిలిపోవుచున్నారు. మానవుడు దుఃఖించుటకొఱకు కాదు ఈ అపూర్వజన్మను బడసినది.

దుఃఖమును పోగొట్టుటకొఱకు ఆత్మజ్ఞానమొకటియే ఇక్కార్యమును సాధింపగలదు. దైవకవచమొక్కటియే శాంతిని ప్రసాదింపగలదు. మాయకు అధీనుడగు జీవుడు మాయాతీతుడగు పరమేశ్వరుని ఆశ్రయించినపుడు మాత్రమే మాయాప్రభావమగు దుఃఖమునుండి విముక్తుడు కాగల్గును.

గొడుగు వేసికొనినవానికి వర్ష బాధ ఎట్లుండదో, చెప్పులు తొడుగుకొనినవానికి కంటకముల బాధ ఎట్లుండదో, కవచమును ధరించినవానికి బాణప్రహార జనిత బాధ ఎట్లుండదో అట్లే మాయాతీతుడగు పరమేశ్వరుని ఆశ్రయించినవారికి, ఆత్మజ్ఞానము కలిగియున్నవారికి సంసారబాధలెవ్వియు ఉండవు. ఇట్టి ఆత్మజ్ఞానమను యుక్తి లేనిచో ఈ మహాసాంసారిక కల్లోలమందు జీవితమే అత్యంతదుర్భరముగా పరిణమించును.

జనకభూపాలుడు సంసారమందున్నప్పటికిని ఈ జ్ఞానరూప కవచమును ధరించియే శాంతిని బొందగలిగియుండెను. అర్జునుడు రణరంగమున శత్రువులను సాహసోపేతముగ ఎదుర్కొనుచు వివిధ కార్యముల

నాచరించినప్పటికిని 'మామనుస్మర యుధ్యచ' (నన్ను స్మరించుచు యుద్ధముచేయుము) అను గీతాబోధను స్మృతిపథమునందుంచుకొని, సదా శ్రీకృష్ణుని తన చిత్తకుహరమున ధ్యానించుచు అట్టి భక్తికవచముచే యుద్ధమును యజ్ఞముగ మార్చివైచెను. భయంకర యుద్ధమాచరించినను పరమశాంతినే పడయగల్గెను. శ్రీకృష్ణుని అనవరతసంస్మరణముచే వ్యవహారసంకులిత క్షేత్రమును విజనారణ్య ప్రశాంత వాతావరణమయముగ నొనర్చుకొనగల్గెను.

భయంకరమగు ఈ సంసారపథమున జను ప్రతిజీవికిని అట్టి దైవకవచరూప రక్షణ అవసరము. కావున ముముక్షువులెల్లరు అద్దానిని పరిగ్రహించి జీవితమును ఆనందప్రపూర్ణముగ గావించుకొనవలెను. మిత్రబాంధవులు దేహమున్నంతవఱకే ఒకింత ఆదుకొనగలరు. ఆ తదుపరి జీవునకు దిక్కెవరు? దేహమున్నను, పోయినను సర్వకాల సర్వావస్థలయందును జనులను కాపాడునది నారాయణుడే. ఆ నారాయణుని ఆశ్రయించినవారికి, ఆ నారాయణకవచమును ధరించినవారికి ఇక ఏలాటి ఆపదలు భయములు ఉండనేరవు.

భగవద్భక్తియే ఆ నారాయణకవచము. ఆత్మజ్ఞానమే ఆ నారాయణ కవచము. నిరంతర దైవస్మరణమే ఆ నారాయణకవచము. అట్టి మహోన్నత అధ్యాత్మకవచమును ధరించి, వ్యవహారమాచరించుకొనుచు, దైవదృష్టిని ఏ కాలమందును వదలక జీవుడు సంసారరంగమున పరమ శాంతిని బొందవలయును. ○○

Our best work is done, when we are without thought of self.

అహంభావమును మఱచినపుడే గొప్ప కార్యమును మనము సాధింపగలము.

# ఆధ్యాత్మిక సంకీర్తన

## శ్రీ దూడం నాంపల్లి గారు (సిరిసిల్ల)

1. ఎందుకే ? ఇదంతా మనసా!
ముందర గలిగెడు మోక్షంబునకై
తొందరపడకను చిందరవందరలాడేవు

2. తల్లిదండ్రులని తల్లడమందేవు
పెళ్లాము పిల్లలని ప్రేమయుజెందేవు
వెళ్లిపోయేనాడు వెంట యెవరు రారు
వల్లకాడుకే వెళ్లెదవీవు

3. కాయము హేయము కలలోని భోగము
మాయు దేహమిది మరువకు మనసా!
తీయని మాటల తీపులలో బడి
చేయకు ద్రోహము చెడెదవు నీవే

4. కాచియున్నాడే కాలయముడు నీ
కోసము ప్రాణము గొనిపోవగను
నీచపు పనులను నీవొనరించిన
నీ గతి దుర్గతి పాలగు నిజముగ

5. తిరుమల తిరుపతి స్థిరవాసుండగు
సిరిరమణుని మది చింతనచేయుము.

1992

# రామాయణ సుధ

## శ్రీ రాముని ధార్మిక ప్రబోధము

1. ఎవడు బలపరాక్రమములతో గూడియున్నవాడై ఉపకారమొనర్చు కార్యార్థులైనవారికి, ముందుగా ప్రతిజ్ఞాపూర్వకముగ ఆశచూపి, తదుపరి దానిని భగ్నమొనర్చునో, అతడు లోకమున అందరికంటెను నీచుడే యగును.
2. నిషిద్ధాచరణము చేయరాదు. ఎవడు ఉత్తమ వివేకము ద్వారా తన క్రోధమును చంపుకొనునో, అట్టి వీరుడు మనుజులందరిలో శ్రేష్ఠుడైయున్నాడు.
3. ధర్మ, అర్థ, కామముల కొఱకై సమయమును విభజించి ఉచితమైన సమయమునందు వానిని న్యాయయుక్తముగ సేవించువాడే శ్రేష్ఠుడగు రాజగును. కాని ధర్మార్థములను త్యజించి కేవలము కామమునే సేవించువాడు చెట్టుయొక్క కాలుచున్న కొమ్మపై నిద్రించువాని పగిది యుండును. క్రిందపడినతరువాతనే అతడు కండ్లు తెఱచుకొనును.
4. ఏ సేవకుడు యజమానిచే ఏదైన దుష్కర కార్యమందు నియుక్తుడై దానిని పూర్తిచేసి తదనురూపమగు మఱియొక కార్యమునుగూడ చేయునో అట్టివాడు సేవకులలో ఉత్తముడని చెప్పబడును.

   ఏ సేవకుడు ఒక కార్యమందు నియుక్తుడై యోగ్యత, సామర్థ్యము ఉన్నప్పటికిని యజమాని యొక్క మఱియొక ప్రియమైన కార్యమును చేయకుండునో అతడు మధ్యమతరగతి సేవకుడని చెప్పబడును.

   ఏ సేవకుడు యజమానియొక్క ఏదైన కార్యమున నియుక్తుడై తనయందు యోగ్యత, సామర్థ్యము ఉన్నప్పటికిని దానిని జాగ్రత్తగ పూర్తిచేయడో అట్టివాడు అధమతరగతికి చెందిన సేవకుడని చెప్పబడును.
5. ఎవడు మిత్రభావముతో నాయొద్దకు వచ్చునో, అతనిని ఏ విధముగను నేను వదలజాలను. అతనియందేదైన దోషమున్నను, అట్టి దోషికి ఆశ్రయమొసంగుట

సజ్జనులకు నిందితము కాదు. శత్రువైనను శరణు బొందినచో, దీనభావముతో చేతులు జోడించుకొని దయను యాచించినచో అతనిపై ప్రహారము సలుపరాదు. శత్రువు ఆర్తుడైనను, అభిమానియైనను, తన విపక్షిని శరణుబొందినచో, శుద్ధ హృదయుడగు శ్రేష్ఠమనుజుడు తన ప్రాణములను గూర్చిన మోహమును వదలి అతనిని రక్షించవలయును.

శరణాగతుని రక్షింపకుండుట గొప్పదోషమని చెప్పబడినది. శరణాగతుని త్యజించుట స్వర్గప్రాప్తిని, సత్కీర్తిప్రాప్తిని నశింపజేయును. మఱియు మనుజుని బలమును, శక్తిని నాశనమొనర్చును. ఎవడు ఒకసారియైనను శరణుబొంది 'నేను నీవాడను' అని చెప్పి రక్షింపుమని ప్రార్థించినచో అతనికి సమస్త ప్రాణులనుండియు నేను అభయమొసంగెదను.

ఒక్కనికొఱకై భూమండలమున సమస్త రాక్షసులను వధించుట సముచితము కాదు. యుద్ధము చేయనివాడు, దాగుకొనినవాడు, చేతులు జోడించుకొని శరణుపొందినవాడు, యుద్ధమున పారిపోయినవాడు, పిచ్చివాడు- ఇట్టివారిని చంపరాదు.

కోపము ప్రాణమును హరించు శత్రువు. కోపము పైకి మిత్రునివలె నగుపించు శత్రువని చెప్పబడినది. కోపము మహాతీక్ష్ణమైన ఖడ్గమువంటిది. కోపము సద్గుణములన్నిటిని నాశనము చేయును. మనుజుడు చేయు తపస్సు, యజ్ఞము, దానములవలన కలుగు పుణ్యము కోపముచే నశించిపోవుచున్నది. కావున కోపమును వదలివేయవలెను.

చెడ్డగుఱ్ఱములవలె విషయముల వైపునకు పరుగెత్తు ఇంద్రియములను, వానినుండి మఱలించి ధైర్యముగ అదుపులో పెట్టవలెను. మనస్సుచేతను, వాక్కుచేతను, క్రియచేతను, దృష్టిచేతను జనులకు మంచినే చేయవలెను. ఎవని యెడలను ద్వేషము కలిగియుండరాదు.

ఈ ప్రకారమాచరించినచో అతడు పాపముచే అంటబడడు. దుష్ట మనస్సు ఎట్టి అనర్థమును చేయునో అట్టి అనర్థమును తీక్ష్ణమగు ఖడ్గముగాని, కాలిక్రింద తిరుగు సర్పము గాని, నిరంతరము క్రోధయుక్తుడైన శత్రువుగాని చేయనేరరు. బుద్ధిమంతులగువారు లోకపీడాకరమగు కార్యమును చేయరాదు. బాలురైనను ఉత్తమవాక్యమును చెప్పినచో, దానిని అంగీకరించుట మంచిది.



# నామసంకీర్తన



1. శివశివ శంకర శశాంక శేఖర। శివశివ శంభో తవ చరణం
భవా భయంకర గిరిజా శంకర। హరహర శంభో తవ చరణం
శైలగిరీశ్వర ఉమామహేశ్వర। జయజయ శంభో తవ
చరణమ్॥

2. నందనందనా గోవిందా। నవనీతచోరా గోవిందా
భక్తవత్సలా గోవిందా। భాగవతప్రియ గోవిందా
వేణువిలోలా గోవిందా। విజయ గోపాలా గోవిందా
కృష్ణా రామా గోవిందా। రామా కృష్ణా గోవిందా॥

3. జయ జయ శంకర। సంతత సుఖకర
జయ జయ శశిధర। జయ కరుణాకర
అగణిత గుణగణ। ఆశ్రితపోషణ
ఫణిమణి భూషణ। పంకజలోచన
నిగమాగమ నుత। నిఖిల బుధార్చిత
జగదభి నందిత। సన్ముని వందిత॥ ౦౦

---

ఓం

వివిధ లోహములచే, వివిధాకృతులుగల పాత్రలలోని జలములో ప్రతిబింబించెడు సూర్యుడొక్కడేయైనట్లు, సర్వజీవులలో ప్రకాశించు ఆత్మ, లేక దైవమును తన ఆత్మగా తెలుసుకొనుటయే సనాతన ధర్మమగును. —శ్రీ మహర్షి మలయాళస్వాములవారు

# సద్గురు సూభాషితములు

## శ్రీ మహర్షి మలయాళస్వాములవారు

1. తినుటకొఱకు జీవించియుండువాడు బద్ధుడు. జీవించుటకొఱకు తినువాఁడు ముక్తుఁడు. దీనిని మఱువకుఁడు.
2. ఒకడు తన యందుండు అనాత్మవృత్తులను ఒక్కొక్కదానిని బయటికి నెట్టివేసెనేని ఒక్కొక్క మెట్టు ఆత్మసన్నిధానమునకుఁ(పరమపదమునకు) నెక్కుచున్నాఁడని గ్రహింపుఁడు. అట్లు సమస్త వృత్తులను నెట్టివేసినచో ఆత్మయొక్క సంపూర్ణమైన మెట్టును యెక్కి గమ్యస్థానమను మోక్షమును చేరఁగలుగును.
3. ప్రభాతకాలములో మనయొక్క నీడ చాల పొడవై కనిపించినను సూర్యుండు పైకి పోను పోను తన ఛాయ తగ్గి, తగ్గి సరిగా మధ్యాహ్నమున తనలో అయిమందునట్లు ఒకరి మనస్సను సూర్యుఁడు స్వరూపస్థితినుండి ఎంత ప్రపంచముఖంగా వాలుచుండునో, వారికి మాయ అంత అపారమై కనుపించును.

   అనుష్టానాది శాస్త్రవిచారణచే మనసు ఎంతవఱకు ఊర్ధ్వగామిగా పోవునో అంతకంతకు మనసు ప్రకృతి క్షయించి, పూర్ణప్రబోధస్థితిలో ఆత్మకన్యముగా ప్రపంచము కనిపింపదు.
4. ప్రతిదినమును హృదయగుహయందు ఏకాగ్రచిత్తుఁడై బ్రహ్మ ధ్యానము చేయుచు రాగాఁ రాఁగా, ఒక దినమున పరబ్రహ్మానుభవస్థితి గలుగును. (అనగా, పరమాత్మ ప్రత్యక్షమగును) పెరుగు మథనము చేయఁగ చేయఁగ, వెన్న బైలుదేరునట్లును; అరణి మథనము మరల మరల చేయునపుడగ్ని ప్రజ్వలించునట్లును; నూతిలోనుండు బురదను

తీయఁగ జల ముత్పన్నమగునట్లును; ఈ బ్రహ్మనిష్ఠులు పరిపూర్ణా నంద సంతృప్తులగుదురు. ఎవరికి బ్రహ్మానుభవస్థితి గలుగలేదో వారికి మనన నిధి ధ్యాసన నిష్ఠ ఇంకను చాలదని తెలియవలయును. పెరుగు నుండి నవనీతము వేఱుపడని కారణముచే మథనము చాలదని తెలియవలయును.

అరణినుండి ఏ కారణముచే అగ్ని జనించలేదు? మథనము తక్కువగా నుండుటవలన, ఎందుచే బావియందు జలము గనఁబడలేదు? మట్టి తీయుట చాలదు. ఇదే దీనికి కారణము. (అరణి యనఁగా యాగాగ్ని కొఱకు చేర్చఁబడు కొయ్య పేరు.)

5. మనోవాక్కాయ కృత్యములు మూడును ఒకేవిధముగా లేనివారి అధ్యాత్మవిషయకమగుఁ అనుష్ఠానములన్నియు వ్యర్థములే. ఎట్లన, ప్రమిద ఒక స్థలమున, తైలము మరియొక స్థలమున, వత్తి ఇంకొక స్థలమున పెట్టి దీపమును ముట్టించిన వెలుగదుగదా!

6. నిర్విషయములచే గలిగెడు అమృతత్వమును, దుర్విషయముచే గలిగెడు విషమత్వమును అనుభవించి తెలియదగినదేగాని వర్ణించుటకు శక్యముగాదు. ౦౦

**యది సత్యం భవేద్విశ్వం సుషుప్తావుపలభ్యతామ్**
**యన్నోపలభ్యతే కించిదతోఽసత్స్వప్నవన్మృషా.**

ఈ జగత్తు సత్యమైనది అగుచో సుషుప్తియందును అది పొందబడ వలసియుండును. అట్లు పొందబడుటలేదు. కావున అది అసత్యమైనదేయగును. స్వప్న పదార్థమువలె అది మిథ్యాభూతమే అయియున్నది. త్రికాలములందును జాగ్రదావ్యవస్థలయందును ఒకేవిధముగ నుండునదియే సత్యపదార్థమని యెఱుగవలెను. కావున ఆత్మయొకటియే సత్యము. తదితరమగు దృశ్య జగత్తంతయు అసత్యమే యగును.

# మహాత్ముల ప్రబోధము

## శ్రీ రామతీర్థస్వామి

1. ఈ శరీరములన్నియు జపమాలయందలి పూసలవంటివి. ఆత్మ వానియన్నింటియందును వ్యాపించియున్న దారమువంటిది. క్షణ కాలము నీవొకచోట నిశ్చలముగ కూర్చుండి "ఆ విశ్వవ్యాపక స్వరూపమే నేను, ఆ అనంతశక్తియే నేను" అని చక్కగ భావించినచో అదియే నీవయియున్నట్లు బాగుగ తెలిసికొనగలవు.

2. ఎపుడు నీవు బాహ్యవస్తువుల కొఱకై పరుగిడి, వానిని పొంద నభిలషింతువో, అపుడే అవి నీకు పొందకుండపోవును. అవి నిన్ను పడగొట్టును. కాని ఎపుడు నీవు వానిని ఉపేక్షించి వానినుండి వెనుకకు తిరిగి ప్రకాశము అన్నిటికిని పరమ ప్రకాశమైన నీ ఆత్మవైపునకు మఱలుదువో ఆ క్షణమందే అనుకూల పరిస్థితులు నిన్ను ఆశ్రయించును. ఆయా పదార్థములు నీకు లభించును. ఇదియొక అధ్యాత్మ నియమము.

3. ఆహా! పరమాశ్చర్యకర విషయము! ఒకే అనంతశక్తి ఈ సమస్త దేహములందును, సమస్త భూతకోట్లయందును, సమస్త నామరూపము లందును వ్యక్తమగుచున్నది. ఏకమై, అనంతమైనట్టి నా ఆత్మయే మహోన్నత ప్రవక్తలయొక్క శరీరములందును, విఖ్యాత వ్యక్తుల యొక్క దేహములందును, అల్పప్రాణులయొక్క శరీరములందును వ్యక్తమగుచున్నది. ఆహా! ఎంతటి ఆనందము! నేను అనంతమగు ఆత్మయేకాని ఈ దేహమును కాను. ○○

---

The pleasure of the self is what the world calls religion.

ఆత్మానందమునే ప్రపంచము మతమని పేర్కొనుచున్నది.

# ఆధ్యాత్మిక కథలు

## రాజులకు రాజు

పూర్వము పవిత్ర గంగానదీ తీరమునందు ఒక సాధువు భగవచ్చింతన యందు కాలము గడుపుచుండెను. అతడు చాల నిరాడంబరముగ జీవించుచు, తన సమీపమునకు వచ్చినటువంటి ముముక్షువులకు అనేక ఆధ్యాత్మిక విషయములను ప్రబోధించుచు, వారిని ఆనందింపజేయుచుండెను.

ఆ మహనీయుడు ఎల్లపుడు ప్రసన్నచిత్తుడై, ధ్యాననిష్ఠయందు సమయమును సద్వినియోగపరచుకొనుచు పరోపకారస్వభావము కలిగియుండెను.

ఆ సాధువు ఉన్న దేశమును ఒక రాజు పరిపాలించుచుండెను. ఆ రాజునకు మహాత్ములను, సాధుసత్పురుషులను సందర్శించవలెనను అభిలాష కలదు. ఒకనాడు రాజు గంగానదీ తీరమునందు వెడలుచుండగా ఆ సాధువు తటస్థపడెను. కౌపీనధారియై వున్న ఆ సాధువు యొక్క శాంతస్వభావమును, నిర్భయత్వమును గమనించి రాజు సంభ్రమాశ్చర్యములలో మునిగిపోయెను. పిదప రాజు ఆ సాధువును సమీపించి ఇట్లు ప్రశ్నించెను–

**రాజు–** ఓ మహాత్మా! తమరివద్ద ధనము ఏ మాత్రము ఉన్నట్లు లేదు. ఏ విధముగ తమరు నిశ్చింతగ ఉండగలుగుచున్నారు? దయచేసి తెలుప ప్రార్థన.

**సాధువు–** ఓ రాజా! నాకు ఏ కోరికలు లేవు. కోరికలు ఉన్నచో వాటిని తీర్చుకొనుటకు ధనము కావలసియుండును. విషయ వాంఛలు

ఏమియు లేనందున ధనము యొక్క ఆవశ్యకత నాకు లేదు. అందువలన నేను నిశ్చింతగ ఉండగలుగుచున్నాను.

**రాజు—** స్వామీ! తమరివద్ద సైనికులుగాని, సేవకులుగాని ఎవరును లేరు. నావద్ద అనేకమంది సైనికులు, పరిచారక జనము కలరు.

**సాధువు—** రాజా! నాకు శత్రువులు ఎవరును లేరు. అందువలన సైనికులతో అవసరములేదు.

**రాజు—** నాకు విశాలమైన, సుందరమైన రాజభవనము, అందు ఎన్నియో విలాసవస్తువులు కలవు. తమకు ఎటువంటి భవనము లేదు.

**సాధువు—** ఓ రాజా! మీ రాజభవనము వాస్తవముగ చిన్నదే. బ్రహ్మాండమంతయు నా నివాసభవనమే. ఆకాశమే పైకప్పు. పచ్చగడ్డి నా మెత్తటి పాన్పు. నా చేతులే తలగడదిండ్లు. దిక్కులే నా వస్త్రములు.

**రాజు—** ఓ సాధువుగారూ! నాకు రమణీయమైన భార్య, బంధు మిత్రులు కలరు. 'నా వారు' అని తెలుపుటకు తమవద్ద ఒక్కరును లేరు.

**సాధువు—** రాజా! శాంతియే నా ధర్మపత్ని. బ్రహ్మజ్ఞానమే నా పుత్రుడు. యమనియమాది, శమదమాది సాధనలే నా బంధుమిత్రులు. విశ్వమునందున్న ప్రాణులన్నియు నావారే. ఆత్మస్వరూపుడనైన నేను బ్రహ్మాండమంతటను వ్యాపించినవాడనై పరమానందమును అనుభవించు చున్నాను.

ఆ ప్రత్యుత్తరములను విని రాజు ఎంతయో సంతోషించెను. ఆ సాధువు యొక్క సద్గుణసంపదకు, అనుష్ఠానమునకు, వైరాగ్యమునకు, బ్రహ్మానుభూతికి అచ్చెరువొందిన రాజు తన హృదయములో గొప్ప మార్పును కలుగజేసుకొనెను. కనుపించు దృశ్యపదార్థములే సత్యమని తలంచుకొనుచుండిన రాజునకు కనువిప్పు కలిగెను. విశ్వమంతటిని పరిపాలించుచు, ప్రాణికోట్ల హృదయములందే నివసించుచున్న భగ వంతుని తెలుసుకొనుటకై రాజు బద్ధకంకణుడాయెను.

# ఆత్మ సందేశము

సాధకులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.

మయ్యాత్మని సమే స్వచ్ఛే సాక్షిభూతే నిరాకృతౌ
దిక్కాలాద్యైః న విచ్ఛిన్నే ప్రత్యాత్మన్యేవేహ తిష్ఠసి.

**ఓ పరబ్రహ్మమా! సమమై, స్వచ్ఛమై, సాక్షిభూతమై నిరాకారమై, దేశకాలవస్త్వాదులచే పరిచ్ఛిన్నము కానిదైనట్టి నా ప్రత్యగాత్మయందే నీవు స్థితుఁడవై యున్నావు. (తద్రూపమే అయియున్నావని భావము)** ○○

---

నీతి : మహాత్ముల సాంగత్యము వలన జనులలో మంచి మార్పు సంభవించును. తన సొంతము అని తలంచుకొనిన ప్రాపంచిక సంపదలు కాలగర్భములో నాశమొందగలవని గ్రహించి మానవుడు శాశ్వత వస్తువునకై ప్రయత్నము సలుపవలసియున్నది. అట్టి శాశ్వత వస్తువు తన హృదయమందే కలదని తెలుసుకొని జనులు నశ్వర బాహ్యవిషయముల యెడల వైరాగ్యమును పెంపొందించుకొని, భగవద్భక్తిని అలవరచుకొని అంతర్ముఖులై ఆత్మానందమును అనుభవించవలెను.

ప్రపంచములోని సమస్త ఆనందములకంటె బ్రహ్మానందము చాల గొప్పది. చక్రవర్తి ఆనందము కంటె, ఇంద్రానందము కంటె, చతుర్ముఖానందము కంటె దైవానందము ఎన్నియో రెట్లు ప్రశస్తమైనది. అట్టి ఆనందము ప్రతి జీవియొక్క హృదయములో విరాజిల్లుచున్నప్పటికిని అజ్ఞానవశమున జనులు దానిని తెలుసుకొనజాలకున్నారు.

కాబట్టి యమనియమాది సాధనముల ద్వారా మనుజుడు జీవితాంతము కాకపూర్వమే ఆత్మసాక్షాత్కారమును బడసి బ్రహ్మానందమునందు నిమగ్నుడై జన్మసార్ధకతనొందవలెను. అట్టి ఆనందానుభూతి కలవాడే రాజులకెల్ల రాజు, రారాజు, విశ్వసామ్రాట్. ○○

# ప్రశ్నోత్తర వేదిక?

# సందేహాలు - సమాధానాలు

## డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్యులు గారు M.A., Ph.D.

(తిరుపతి)

**ప్రశ్న : *లోకంలో అందఱు ఒకే లక్షణాలు, అర్హతలు కలవారై ఉండరుకదా! అందఱికీ భగవంతుణ్ణి చేరాలంటే వారి వారికి తగినట్లు ఏవైనా మార్గాంతరాలున్నాయా? ఎలా భక్తులు భగవంతుణ్ణి చేరాలి?***

**జవాబు :** ఏ పనికైనా ఆయా వ్యక్తుల అధికారాల్నిబట్టి మార్గం ఉంటుంది. అధికారమంటే అతడి అర్హత. అందఱికీ ఒకే మార్గం అంటూ ఉండదు. వారి వారి అర్హతనుబట్టి మార్గాలుంటాయి. ఇందులో–

**మొదటి మార్గం :** మనస్సును ఎల్లప్పుడు భగవంతునిపైన ఉంచడం. మనకు ప్రతి క్షణం కలిగే జ్ఞానాలను భగవత్పరంగా చేయడం. అలా చేయగలిగితే మనం భగవంతునిలోనే నివసిస్తాం. ఏమీ సందేహపడవలసిన పనిలేదు.

**రెండవ మార్గం :** ఎప్పుడూ మనస్సును ఆయన పైనే ఉంచడానికి నీకు సమర్థత లేకపోతే, అభ్యాసయోగంతో దేవుణ్ణి పొందాలని ఎప్పుడూ కోరుకో.

**మూడవ మార్గం :** అలా భగవంతుణ్ణి పొందాలని మనశ్చాంచల్యం వల్ల కోర లేకపోతే దేవుని కోసం, ఆయన ఆరాధన కోసం ప్రతి పనినీ ఆయనకు అంకితం చెయ్. స్వామి కోసం కొన్ని కర్మలు చేసినప్పటికి నీకు సిద్ధి లభిస్తుంది.

**నాల్గవ మార్గం :** అలా భగవత్పరమైన కర్మలు చేయటానికి కూడా నీకు శక్తి లేకపోతే, భగవంతుణ్ణాశ్రయించి, ఇంద్రియ మనో నిగ్రహంతో నీవు నిత్యం చేసే కర్మల ఫలాన్ని ఆయనకు త్యాగం చెయ్.

ఈ చివటి మార్గానికి అందఱూ అధికారులే. వారి వారి పనులు వారు చేసుకో వచ్చు. ఫలాన్ని భగవంతునికి వదిలి వేస్తే చాలు. క్రమంగా వారికి మనోనైర్మల్యం కలుగుతుంది. దీనికి మనోనిగ్రహం కావాలి. వీటిల్లో దేన్ని ఆశ్రయించినా మోక్షం వస్తుంది.

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః॥

(భగవద్గీత 12-8)

*ప్రశ్న : లోకంలో జ్ఞానమనీ, ధ్యానమనీ, ఫలత్యాగమనీ, శాంతి అనీ కొన్నింటిని వింటున్నాంకదా! వీటిల్లో ఏది శ్రేష్ఠమైంది?*

**జవాబు :** గుడ్డిగా అనేక సాధనలు చేయడంకంటే జ్ఞానం చాలా మంచిది. కేవలం జ్ఞానంకంటే ధ్యానం మంచిది. దానివల్ల మన మనస్సుకు ఏకాగ్రత కలుగుతుంది. ధ్యానంకంటే కర్మఫలాన్ని త్యాగం చేయడం మంచిది. కర్మఫలాన్ని భగవంతుని కర్పిస్తే అహంకారం నశించి, వైరాగ్యం కలుగుతుంది. భగవంతుని అతిమానుషత్వం గోచరిస్తుంది. మనస్సుకు శాంతి లభిస్తుంది. ఈ కర్మఫల త్యాగంకంటే దానివల్ల కలిగే శాంతి చాలా శ్రేష్ఠమైంది.

శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాన్తి రనన్తరమ్॥

(భగవద్గీత 12-12)

○○

## వైశంపాయన ఉవాచ

**యత్ర యోగేశ్వరః కృష్ణో యత్రపార్థో ధనుర్ధరః**
**తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువానీతి ర్మతిర్మమ.**

**ఎచట యోగీశ్వరుడగు శ్రీ కృష్ణభగవానుడుండునో, ఎచట ధనుర్ధారి యగు అర్జునుడుండునో, అచట ఐశ్వర్యము, విజయము ధర్మము ఉండునని నా యభిప్రాయము.**

# మిత్రమా!
# ఎందుకు బాధ పడుచున్నావు?

ఈశ్వర్

వ్యాపారములో నష్టమొచ్చిందనా?

కోట్లు సంపాదించలేదనా?

నీవు అనుకున్నది జరగలేదనా?

సంతానము లేదనా? ఉన్న సంతానము గతించినదనియా?

ఉండి కూడ నీ సంతానము నీవు చెప్పినట్లు వినలేదనియా?

పెక్కు అంతస్థుల మేడ కట్టలేదనా? A.C.(ఎ.సి.) రూము లేదనియా? కారు లేదనియా? నిన్ను గౌరవించువారు లేరనియా? అధికారము లేదనియా? ఒక్క నిముషము ఒక్క విషయాన్ని గురించి ఆలోచించు మిత్రమా!

రాత్రి నిద్రలో హాయిగా, ఆనందంగా గడిపావుగదా?

అట్టి అపరిమితానందము ఏ వస్తువువలన గలిగినది? ఏమి తింటే గలిగింది? ఏమి చూస్తే గలిగింది? ఏమి తినలేదు, ఏమి చూడలేదు, సమస్తము మరిచావుగదా?

అలా సమస్తము మరచినప్పుడు గలిగిన హాయి, ఆనందము, సుఖము, సంతోషము ఎల్లప్పుడు అనుభవించాలని నీకు వున్నచో **అన్నిటిని వదలి అడవులకు పారిపోవనవసరము లేదు.** తామరాకు నీటిని వదలి పారిపోదు. నీటిలో వుంటూ నీరును అంటుకోదు. అలాగే నీవు కూడా సంసారములో వుండి నను అంటుకోకు, తగులుకోకు. అప్పుడు అపరిమిత ఆనందం నీ వశమగును. అదియే ఆత్మానందము. అట్టి ఆనందమే స్థిరమైనది. శాశ్వతమైనది.

అట్టి ఆనందము కొఱకే అందరూ పాటుపడుచుందురు.

భగవదనుగ్రహము<br>
గురు ఆశీర్వాదము } అట్టి శాశ్వతానందము అందరూ బడయవచ్చును.<br>
స్వప్రయత్నములతో

OO

# ఉపమానము ద్వారా బోధ

ముఞ్జా దిషీకా మివ దృశ్యవర్గా
త్ప్రత్యఞ్చ మాత్మాన మసఙ్గ మక్రియమ్
వివిచ్య తత్ర ప్రవిలాప్య సర్వం
తదాత్మనా తిష్ఠతి య స్సముక్తః

ముంజగడ్డి లోపలి దర్భ యుండును. పవిత్ర కార్యముల కొఱకై దర్భను ఉపయోగింపదలంచువారు ముందుగ ఆ ముంజ గడ్డిని విడదీసి తదుపరి దానియం దుండు దర్భను తీసుకొందురు.

అట్లే పంచకోశముల లోపల ఆత్మ దాగియున్నది. ఆత్మను పొందదలంచు వాడు ముందుగ ఆ అన్నమయాది పంచకోశములను గూర్చి తెలుసుకొని అవి జడములని, దృశ్యములని నిర్ణయించి వాటి యెడల మమత్వము కలిగియుండక, వాటికి సాక్షిగయున్న ఆత్మయే తానని నిశ్చయించి అట్టి ఆత్మయందే నిలకడ కలిగి యుండవలెను. ఆత్మానుభూతికి, ముక్తికి ఇదియే సూటియైన మార్గము.

మోక్షస్య కాఙ్క్షా యది వై తవాస్తి
త్యజాతిదూరా ద్విషయా న్విషం యథా,
పీయూషవ త్తోష దయాక్షమార్జవ
ప్రశాన్తి దాన్తీ ర్భజ నిత్యమాదరాత్

విషమును ఎవరును పరిగ్రహించరు. అది ప్రమాదకరమైనది. అది అపకారమును కలుగజేయును. కనుక త్యాజ్యము. అమృతము గ్రహింపదగినది. అది ఉపకారమును కలుగజేయును. కాబట్టి గ్రహింపదగినది. విజ్ఞుడగువాడు అమృతమును గ్రహించి విషమును పరిత్యజించును.

అట్లే ప్రాపంచిక విషయ భోగములు జీవుని అజ్ఞానమును పడద్రోయును. కావున వాటిని విషమువలె పరిత్యజించవలెను. ముముక్షువగువాడు వాటిని దరికి చేర్చరాదు. సత్యము, దయ, అహింస, ప్రేమ, కరుణ, భక్తిజ్ఞాన, వైరాగ్యాది సుగుణములను అమృతమువలె స్వీకరించవలెను. మోక్షమును కోరువాడు అవలంబించవలసిన పద్ధతి ఇదియే.



# మధురాష్టకము

## శ్రీ వల్లభాచార్యులవారు

అధరం మధురం వదనం మధురం
నయనం మధురం హసితం మధురం
హృదయం మధురం గమనం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్ 1

మధురాధిపతియగు శ్రీకృష్ణపరమాత్మ యొక్క పెదవి మధురమైనది. ముఖము మధురమైనది. నేత్రములు మధురములైనవి. నవ్వు మధురమైనది. హృదయము మధురమైనది. నడక మధురమైనది. వెయ్యేల, అతని యొక్క సమస్తము మధురమైనదే యగును.

వచనం మధురం చరితం మధురం
వసనం మధురం వలితం మధురమ్
చలితం మధురం భ్రమితం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్ 2

మధురాధిపతియైన శ్రీకృష్ణుని యొక్క వాక్కులు మధురములైనవి. చరిత్రము మధురమైనది. వస్త్రము మధురమైనది. చలనం మధురమైనది. గమనం మధురమైనది. భ్రమణము మధురమైనది. అతని యొక్క సమస్తము మధురమైనది.

వేణుర్మధురో రేణుర్మధురః
పాణిర్మధురః పాదౌ మధురౌ
నృత్యం మధురం సఖ్యం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్ 3

మధురాధిపతియైన శ్రీకృష్ణుని యొక్క పిల్లనగ్రోవి మధురమైనది. పాద ధూళి మధురమైనది, చేతులు మధురమైనవి, పాదములు మధురమైనవి, నృత్యము

మధురమైనది, సఖ్యము మధురమైనది. అతని యొక్క సమస్తము మధురమైనదే యగును.

గీతం మధురం పీతం మధురం
భుక్తం మధురం సుప్తం మధురమ్
రూపం మధురం తిలకం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్ 4

మధురానాథుడగు శ్రీకృష్ణుని యొక్క పాట మధురమైనది. పానము మధురమైనది. భోజనము మధురమైనది. నిద్ర మధురమైనది. రూపము మధురమైనది. బొట్టు మధురమైనది. అతని యొక్క సమస్తము మధురమైనదే.

కరణం మధురం తరణం మధురం
హరణం మధురం రమణం మధురమ్
వమితం మధురం శమితం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్ 5

మధురాధిపతియగు శ్రీకృష్ణమూర్తి యొక్క కార్యములు మధురములైనవి, తరణము మధురమైనది, హరణము మధురమైనది, రమణము మధురమైనది. వమనము మధురమైనది, శాంతి మధురమైనది, అతనియొక్క సమస్తము మధురమైనది.

గుఞ్జామధురా మాలా మధురా
యమునా మధురా వీచీ మధురా
సలిలం మధురం కమలం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్ 6

మధురా నాధుడగు శ్రీకృష్ణుని యొక్క ధ్వని మధురమైనది. మాల మధురమైనది. యమునా నది మధురమైనది. యమునా తరంగములు మధురములైనవి. యమునా జలము మధురమైనది. దానియందలి కమలము మధురమైనది. శ్రీకృష్ణుని యొక్క సమస్తము మధురమైనదే యగును.

గోపీ మధురా లీలా మధురా
యుక్తం మధురం ముక్తం మధురమ్
దృష్టం మధురం శిష్టం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్ 7

మధురాధిపతియగు శ్రీకృష్ణుని యొక్క గోపికలు మధురమైనవారు, అతని లీల మధురమైనది,అతని సంయోగ వియోగములు మధురములైనవి. చూపు మధురమైనది. శిష్టాచారము మధురమైనది. అతనియొక్క సమస్తము మధురమైనదేయగును.



- జీవితమున విజయము సాధించుటకు ఉపాయములు—దృఢసంకల్పము, పట్టుదల, పరిశ్రమ.
- ఉన్నది ఉన్నట్లుగా చూచుట, చేయునది చేయవలసిన రీతిగా చేయుట—ఇదియే ఉత్తమ జ్ఞానము.
- సన్మానములు అందుకొనుట గొప్పతనముకాదు. వాటికి తాను తగుదునాయని ఆలోచించుటలో వున్నది గొప్పతనము.
- పాటుపడుటలోకల ఆనందమును చీమను చూచి నేర్చుకొనుము.
- ఏమియు చేయనివాడేకాదు. చేయగలిగికూడ మంచి పనులు చేయనివాడు కూడ సోమరే.
- మతములన్నియు ఒకే తోటలో పూసిన రంగు రంగుల పూలవంటివి. (లేక) ఒకే చెట్టు నుండి వెలువడిన వేరు వేరు కొమ్మలవంటివి. కావున భిన్నత్వములో ఏకత్వమును చూడవలెను.
- సుఖము సీతాకోకచిలుకవంటిది. దానిని వెంటాడినకొలది అది అందకుండా పోవును. ప్రశాంతముగా కూర్చొనినచో అది మన ఒంట్లో వచ్చి వ్రాలును.

OO

---

*గోపా మధురా గావో మధురా*
*యష్టిర్మధురా స్సృష్టిర్మధురా*
*దలితం మధురం ఫలితం మధురం*
*మధురాధిపతే రఖిలం మధురమ్* 8

మధురాధిపతియగు శ్రీకృష్ణపరమాత్మ వెంటగల గోపాలురు మధురమైన వారు, గోవులు మధురములైనవి, కఱ్ఱ మధురమైనది, సృష్టి మధురమైనది, దలనము మధురమైనది, ఫలితము మధురమైనది. వెయ్యేల ఆ శ్రీకృష్ణుని యొక్క సమస్తము మధురాతి మధురమే అయి యున్నది.

ఇతి శ్రీమద్వల్లభాచార్య కృతం మధురాష్టకం సంపూర్ణమ్.

OO

# సృష్టిలోని వింతలు - విశేషాలు

1) సూర్యుని చుట్టూ ఒకసారి తిరుగుటకు యురేనస్ గ్రహమునకు 84 సంవత్సరములు పట్టును.

2) ప్రపంచములోకెల్లా దక్షిణ అమెరికాలోని బ్రెజిల్‌లో ఇనుప ఖనిజము ఎక్కువగా లభించును.

3) హాలండ్‌లోని ఒక గొప్ప శ్రీమంతుడు పియట్ డెర్క్సన్ 15 కోట్ల డాలర్లను రోగులను, దరిద్రులను ఆదుకొను సంస్థకిచ్చి "నా తల బరువును వదల్చుకొని ఇప్పుడు హాయిగా ఉన్నాను" అనెను.

4) శని గ్రహము వ్యాసము 74 వేల మైళ్లు.

5) జపాన్‌లోని టోక్యోలో కల నిప్పాన్ ఉక్కు కర్మాగారము ప్రపంచములోకెల్ల మిక్కిలి పెద్దది. అది సంవత్సరమునకు దాదాపు 3 కోట్ల టన్నుల ఉక్కును తయారుచేయును.

6) యుగోస్లావియాలో నోవీపాతెలో నివసించు పాజ్‌కిక్ అను వ్యక్తి 10 వేల ఓల్టుల విద్యుచ్ఛక్తిని తట్టుకొనగల్గుచున్నాడు.

7) బృహస్పతి చుట్టూ పండ్రెండు ఉపగ్రహములు తిరుగుచున్నవి. వానిలో 4 పెద్దవి, ఎనిమిది చిన్నవి.

Until we give up the world manufactured by ego, never can we enter the kingdom of Heaven.

మనస్సుచేత తయారుచేయబడిన ఈ ప్రపంచమును విస్మరించినతప్ప దైవసామ్రాజ్యమందు అడుగుపెట్టలేము.

వేదాంతభేరి

# [illegible] బొమ్మలు

రాతి బొమ్మ, గుడ్డ బొమ్మ ఉప్పు బొమ్మ–అను మూడు బొమ్మలు సముద్ర స్నానానికి వెళ్లినవట.

1. రాతి బొమ్మ సముద్రంలో స్నానంచేసి బయటికి వచ్చిన వెంటనే దానిపై గల సముద్రపు నీరు ఆరిపోయెను.

2. గుడ్డ బొమ్మ స్నానము చేసి బయటకు వచ్చిన రెండు రోజుల వరకు తనలో ఆ సముద్రపు నీరును ఉంచుకొనెను.

3. ఉప్పు బొమ్మ సముద్రంలో స్నానముచేసి తిరిగి రాలేదు. సముద్ర జలములో లీనమై పోయినది.

అట్లే అధములు దైవతత్త్వమును గూర్చి వినినను అది వారి మనస్సుకు ఏమాత్రము పట్టదు. మధ్యములు దైవతత్త్వమును వినిన కొంతకాలము వఱకు దానిని తమయందుంచుకొని ప్రభావితులగుదురు. తరువాత ఆ విషయమును పట్టించుకొనరు. ఇక ఉత్తములు దైవతత్త్వమును చక్కగా విని దానిని తమలో జీర్ణింపజేసికొని దైవభావములో తన్మయులైపోవుదురు. వారు సదా దైవమయులై ఉందురు. దైవభావమును ఇక జీవితమున వారెన్నటికి విస్మరించరు. తమ హృదయమందే దైవమును ప్రతిష్ఠించుకొని జీవితమును ప్రశాంతముగ, ఆనందముగ గడుపుదురు. ○○

God is the only real existence. There cann't be two. There is but one soul and "I am that".

ఇచట వాస్తవముగ ఉన్నది దేవుడు ఒకడే. దేవుడు కాక, ఆత్మ కాక మఱియొక వస్తువు ఉండనేరదు. ఒకే ఆత్మ కలదు. ఆ ఆత్మయే 'నేను'.

# సమానత్వం – వేదాంతం

## ఓంప్రకాశ్

నేటి మన ఆధునిక కాలంలో "సమానత్వం" గూర్చి అనేకులు అనేక మార్గాలద్వారా మాట్లాడుతున్నారు. రకరకాల ఉద్యమాలు ప్రభవించి-ప్రచారం చేస్తూ ఆందోళనలు చేస్తున్నాయి. "మానవులంతా ఒకటే. వారిలో వర్ణభేదాల కారణంగా, లింగభేదాల కారణంగా, జాతి భేదాల కారణంగా ఎట్టి అసమానత్వం ఉండకూడదు. పురుషులతోపాటు స్త్రీలకు కూడా సమాన హక్కులుండాలి. ధనిక-దరిద్ర భేదాలుండకూడదు. ఉచ్ఛ-నీచ జాతి భేదాలుండకూడదు. అగ్ర-నీచ వర్ణాది తేడాలుండకూడదు. ఒక మనిషి మరో మనిషిని తక్కువ చేయకూడదు. అందరూ మనుషులే. కాబట్టి అందరూ సమానులే. అలాగే జీవించాలి" అని ఈ ఉద్యమాలు డిమాండ్ చేస్తుంటాయి.

నిజానికి మానవులేకాదు, సర్వప్రాణులు కూడా సమానులేనని మన వేదాంతం చెబుతుంది. మట్టితో శిల్పి రకరకాల బొమ్మలు చేస్తాడు. పక్షి, మృగం, జంతువు, పశువు, ఆవు, కోతి, ఏనుగు, సింహం, గ్రద్ద, కాకి, కోడి, బాతు, చీమ, బల్లి, పాము, తేలు ఇలాంటి  మానవేతర జీవుల బొమ్మలు తయారుచేస్తాడు. అలాగే మానవుల బొమ్మలు కూడా తయారుచేస్తాడు. బాలిక, బాలుడు, శిశువు, వృద్ధుడు, తరుణి, ప్రౌఢ, స్త్రీ, పురుషుడు, దొర, నౌకరు, యజమాని, కార్మికుడు, డాక్టరు, రోగి, ధనికుడు, దరిద్రుడు-ఇలా మానవులలోని రకరకాల మానవుల బొమ్మలు కూడా తయారుచేస్తాడు.

నిజానికి బొమ్మలలో పైపై ఆకారాదులను గనుక గణనకు తీసుకుంటే, ఇవి ఒకదానికి మరొకటి దేనికది వేరుగానే ఉంటాయి. అవన్నీ సమానమే అని మనం ఎంత మొత్తుకున్నా అవి సమానం కాజాలవు. ఏనుగు ఏనుగుగానే ఉంటుంది; సింహం కాజాలదు. సింహం సింహంగానే ఉంటుంది, మనిషి కాజాలదు. మనిషి మనిషిగానే ఉంటాడు, మృగం కాజాలదు. స్త్రీ స్త్రీగానే ఉంటుంది, పురుషుడు కాజాలదు.

కాబట్టి పైపై ఆకారాదులరీత్యా, సమానత్వం అసంభవం. అయితే ఏమాత్రం వివేకం ఉన్నవాడికైనా, పై బొమ్మలన్నీ ఒక రీతిలో సమానంగానే తోస్తాయి. నిర్మించిన శిల్పికి అవన్నీ సమానమే. కొనే వ్యాపారికి అవన్నీ సమానమే. ఏనుగును, వ్యాపారి ఏనుగు వెల ఇచ్చి కొనడు. మనిషిని, మనిషిగా భావించి శిల్పి అమ్మడు. అవన్నీ మట్టి బొమ్మలు.

ఆకారం ఏదయినా, మట్టిని బట్టి అవన్నీ ఒకటే. కాబట్టి మట్టిరీత్యా రకరకాల ఆకారాల్లోనున్న బొమ్మలన్నింట్లో సమానత్వం సిద్ధమవుతుంది. ఏ బొమ్మ మరొకదానికన్నా గొప్పదీకాదు, అల్పమైనదీకాదు. అది మట్టి బొమ్మే, ఇదీ మట్టి బొమ్మే. కాబట్టి బొమ్మల మధ్య మట్టి సమానత్వం చేకూరుతుంది. అంతేగాని ఆకారాలనుబట్టి సమానత్వం ఎన్నటికీ చేకూరదు.

దీనినే మన వేదాంతం "భిన్నత్వంలో ఏకత్వం" అని సూత్రీకరిస్తుంది. అంటే "అసమానత్వంలో సమానత్వం" అన్నమాట.

మట్టి బొమ్మలలో నామరూపాలు తీసివేస్తే మిగిలేది ఏమిటి? కేవలం మట్టియే. అంటే ఒకే మట్టి వివిధ నామరూపాలద్వారా అనేకంగా భేదించినట్లు భ్రమ కలిగిందికదా! అలాగే రకరకాల రూపాలలో–నామాలతో కనిపించే ఈ శరీరాలన్నింటికీ ఆధారం ఒకే ఒకటుంది. శరీరాల నామరూపాలన్నీ తొలగిపోతే, మిగిలే చైతన్యం ఒకటుంది. దానినే మన వేదాంతం పరమ సత్యం, ఆత్మ, బ్రహ్మం అంటుంది.

ఈ నామరూపాలన్నీ కల్పనలంటుంది. కాబట్టి వివిధ శరీరాలన్నీ ఆత్మ ధరించే రకరకాల నామరూపాలే. ప్రతి శరీరంలో ఉండేది ఒకే ఒక ఆత్మ. ఇంకా చెప్పాలంటే అన్ని శరీరాలు తానొక్కటే. తానే అన్నీ అయి ఉన్నప్పుడు అసమానత్వం చూపటం మూర్ఖత్వం అవుతుంది. కాబట్టి ఆత్మరీత్యా అంతా సమానమే, ఏకమే అంటుంది వేదాంతం. OO

Conquer your self and the whole universe is yours.

నీ మనస్సును జయించుకొనుము. అప్పుడు ప్రపంచమంతయు నీవే అగుదువు.

# వినోదము-వికాసము

## చిలుక ఏడుపు

ఒక ఊళ్ళో ఒక రాజు వుండేవాడు. అతనికి రామచిలుక అంటే చాలా ప్రీతి. ఒక రామచిలుకను ఎక్కడో సంపాదించాడు. దానిపై ఎక్కువ మక్కువ కలిగి గారాబంగా పెంచుతున్నాడు. దాని కోసం ఒక బంగారపు పంజరం ఏర్పాటుచేశాడు. ఎప్పుడైనా దానికి స్నానం చేయించాలంటే, ఒళ్ళు కడగాలంటే రాజు తానే స్వయంగా ఆ పని చేస్తూండేవాడు. దానికి ఎప్పుడైనా ఆకలైతే తానే స్వయంగా దానిమ్మపళ్ళు, మామిడిపళ్ళు పెడ్తుండేవాడు. దానికెప్పుడైనా దాహమైతే పాలు పోస్తూండేవాడు.

ఈ ప్రకారంగా రాజు రామచిలుకను ఎంతో ప్రియమైన వస్తువుగా భావించి దానికి ఎన్నో సపర్యలు చేస్తూండేవాడు. ఇన్ని చేస్తున్నా, ఇంతటి గౌరవమర్యాదలు పొందుతున్నా, సాక్షాత్ రాజుచే స్వయంగా సేవ చేయించుకుంటున్నా ఆ చిలుక పంజరంలో కూచొని ఏడుస్తూంది. దానికి సంతోషం లేదు. ఈ రాజమర్యాదలన్నిటిని అది లెక్క చేయటం లేదు. వాటిచే దానికి సంతృప్తి కూడ లేదు.

"నేనెపుడు ఈ బంధనం నుంచి విడిపోయి అరణ్యంలో చెట్టుపై స్వేచ్ఛగా విహరిస్తానా?" అని అది ఉవ్విళ్ళూరుతూంది. బంధనం నుంచి తప్పించుకొని పారిపోయి తన పక్షిజాతితో చేరి అరణ్యంలో స్వతంత్రంగా విహరించాలని ఆ చిలుక ఉబలాటపడ్తూంది. అందుకొరకే అది ఏడుస్తూంది. రాజమర్యాదలు ఎంతో గొప్పవైనా దానికవి రుచించలేదు. స్వాతంత్ర్యమే దానికి పరమానందంగా తోచింది.

ఆహా! ఆ చిలుక జనానికి ఎంత చక్కటి పాఠాన్ని బోధిస్తూంది. ఓ జనులారా! ఈ ప్రాపంచిక సుఖాలు, ఈ భోగభాగ్యాలు మీరెన్ని అనుభవిస్తున్నా ఈ ఉపాధిలో వుండటం, శరీరాన్ని ధరించటం, దేశకాల క్రియలు అను బంధనంలో చిక్కుకోవటం తప్పించుకోవాలి.

ఈ జనన మరణరూప బంధనం నుండి విడుదలై పొంది ఆత్మ స్వాతంత్ర్యాన్ని అనుభవించాలి. చిల్లర మల్లర ఆనందాలను లెక్కచేయక బ్రహ్మానందసముద్రంలో మునుకలిడాలి. ఈ ప్రాపంచిక సుఖాలు ఎంత గొప్పవైనా అవి నశ్వరాలు, క్షణికాలు.

వేదాంతభేరి

# అమృత బిందువులు

అనిత్యాని శరీరాణి
విభవో నైవ శాశ్వతః
నిత్యం సన్నిహితో మృత్యుః
కర్తవ్యో ధర్మసంగ్రహః.

**శరీరములు అశాశ్వతములు. సంపదలు శాశ్వతములు కావు. మృత్యువు నిరంతరము సమీపముననే పొంచియున్నది. కాబట్టి ధర్మమును ఆచరించవలెను.**

యత్సముత్పతితం క్రోధం క్షమయైవ నిరస్యతి
యథోరగస్త్వచం జీర్ణాం సవై పురుష ఉచ్యతే.

**సర్పము తన కుబుసమును వదలివేయునట్లు, ఎవడు పొంగివచ్చు కోపమును ఓర్పుతో తొలగించివేయునో అట్టివాడే మనుజుడని చెప్పదగును.** ○○

దుఃఖమిశ్రితాలు. కాబట్టి వాటి వెంట పరుగెత్తటం విజ్ఞులకు పాడి కాదు. వివేకవంతుడు ఈ మేడలు, మిద్దెలు, అధికారాలు, దేహ సౌందర్యాలు, ఇతర ప్రాపంచిక సంపదలను గొప్పవిగా తలంచడు. అవన్నీ కాలగర్భంలో లీనమై పోతాయి.

కావున "భగవంతుడొకడే శాశ్వతుడు. ఆత్మ ఒక్కటే శాశ్వతము" అని నిశ్చయించి జనులు బంధవిముక్తి కొరకై తీవ్రమైన సాధన సలిపి ఈ జీవితం పూర్తికాక మునుపే ఆత్మ సాక్షాత్కారాన్ని పొంది ఆనందించాలి. అదే ప్రతివాని లక్ష్యం. అదే ప్రతివాని గమ్యం. అదే ప్రతివాని ధ్యేయం. జై గురుదేవ్.

వాసః కాంచన పంజరే నృపవరై ర్నిత్యం తనోర్మార్జనం
భక్ష్యం స్వాదురసాలదాడిమఫలం పేయం సుధాభం పయః
పాఠ్యం సంసది రామనామ సతతం ధీరస్య కీరస్యభో
హాహా హన్త తథాఽపి జన్మవిటపి క్రోడం మనోధావతి

ఈ శ్లోకము యొక్క భావము పైన తెలిపినదే. ○○

# గీతావాహిని

## పుణ్యకార్యాచరణ

శ్రీకృష్ణపరమాత్మ గీతయందు యజ్ఞదాన తపఃకర్మలను త్యజించవల దనియు, అవి ('పావనాని మనీషిణామ్')- జీవుల చిత్తమును శుద్ధపఱచును గావున వాటిని తప్పక ఆచరించవలయుననియు జ్ఞాపకము చేసెను. మేడ ఎక్కకమునుపే నిచ్చెనను కాలదన్నివేయు సాధకులకు భగవానుని ఈ వాక్యములు కనువిప్పుగా నుండగలవు. ఎటువంటి వానికైనను చిత్తశుద్ధిలేనిచో జ్ఞానమెట్లు కలుగగలదు?

మురికి అద్దములో తన ముఖము చూడగల్గువాడింతవఱకెవడును జగత్తున ఉద్భవించలేదు. ఉద్భవించడుకూడను. ఈ కీలకము తెలిసియే మహనీయులగు శాస్త్రజ్ఞులు ఎంత అతీతమగు జ్ఞానమును ప్రబోధించినప్పటికిని, దాని సాఫల్యమునకు అత్యావశ్యకమైనట్టి హృదయనిర్మలత్వమును, అట్టి నిర్మలత్వమును సాధించునట్టి నైతిక గుణగణములను (ethics) నొక్కి చెప్పుచువచ్చిరి. సర్వజనాదరణీయంబైన గీతాగ్రంథమవలంబించిన పద్ధతియునిదియే. చిత్తశుద్ధికరములగు పుణ్యకార్యములయెడ ముముక్షువులు శ్రద్ధ గలిగియుందురుగాక!

అయితే అట్టి కార్యములను ఆచరించునపుడు మనుజుడు నిరుత్సాహమునకు, అధైర్యమునకు ఏ మాత్రము తావీయరాదు. 'ధృత్యుత్సాహసమన్వితుడై' యుండ వలెను. ఆయా కార్యములందు ఫలాపేక్షలేక, దైవార్పితబుద్ధితో నాచరించుచుండవలెను. కార్యము సిద్ధించినను, సిద్ధించకపోయినను నిర్వికారుడై మెలగవలెను. ఇట్టివాడే సాత్త్వికకర్త. మొదట కర్మాచరణమున పరిశుద్ధుడు కానిదే ఆధ్యాత్మపథమున జీవుడు ఉన్నత శిఖరములను అందుకొనలేడు. మనుజుని చిత్తము ఏ స్థితియందున్నదో అతని ఆచరణమే పట్టి చూపును. రాగద్వేషయుక్తుడై ఫలాభిలాషతోగూడి, లోభబుద్ధి గలిగి, హింసాయుతముగ కర్మనాచరించువాడును, శుచిత్వము లేకయుండువాడును, హర్షశోకములకు లోనగువాడును, లేక సోమరితనముతోగూడి ఎల్లపుడు విషాదచ్ఛాయ లచే నావృతుడై దీర్ఘసూత్రియై యొప్పువాడును ఆచరణమున పరిశుద్ధత్వమును బొందనివాడే యగును. కావున ఇట్టి నికృష్ట భావములను పరిత్యజించి సాత్త్వికబుద్ధితో కర్మాచరణము గావించుచు, నిర్మలమగు అనుష్ఠానము గలిగియుండు వాడు అచిరకాల ములో పరమార్థ క్షేత్రమున గొప్ప అభివృద్ధిని సాధించగలడు. ○○

# ఓ మనస్సా! వినుము

[illegible]

[illegible]

[illegible] పోగొట్టుకో ఓయి మనసా

[illegible]

పురుషార్థ మేదిరా

బాగుగా యోచించు మనసా

ఒక వ్యక్తి తన జీవితం లోపల ఎన్నియో రోగాలను అనుభవిస్తున్నాడు. ఒక్కొక్క రోగం వస్తే మందులు, మాకులు వాడుకొని బ్రహ్మ ప్రయత్నం చేసి దాన్ని పోగొట్టుకొంటున్నాడు. కానీ ఆ రోగాలు పూర్తిగ వదలటం లేదు. మరల మరొక వ్యాధి రూపంగా అది వచ్చి అతన్ని బాధిస్తుంది. కొన్ని దీర్ఘకాలవ్యాధులు, మరికొన్ని అల్పకాలవ్యాధులు మీదపడి అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. కానీ ఈ అన్ని వ్యాధులకంటెను అతి దీర్ఘమైన వ్యాధి ఒకటుంది. అది అనాదికాలం నుండి జీవుని వేధిస్తున్నది. దానికే "భవరోగము" అని పేరు. పుట్టటం, చావటం అనేది ఆ వ్యాధి. పుట్టినవాడు చస్తున్నాడు; చచ్చినవాడు మరల పుడుతున్నాడు. శ్రీ శంకరాచార్యుల వారు ఈ భవరోగాన్ని దీర్ఘరోగంగ వర్ణించారు.

ఇట్టి దీర్ఘరోగంతో బాధపడుతున్నా మానవుడు ఇతర రోగాలకు చికిత్స చేసుకొనునట్లు దీనికి చికిత్స చేసుకోవటం లేదు. అందువల్లనే ఈ రోగం ముదిరిపోయి జీవుని నానా ఇక్కట్లు పాలు చేస్తున్నది. కనుక విజ్ఞుడైనవాడు ఈ సత్యాన్ని త్వరితముగ గుర్తెరిగి, తానొక దీర్ఘరోగంతో బాధపడుతున్నాడని తెల్సుకొని, దాని నివారణకై ప్రయత్నం చేయాలి. ఆత్మజ్ఞానమే భవరోగానికి రామబాణ ఔషధము. సద్గురువుల వల్ల తనయొక్క ప్రయత్నాతిశయం వల్ల అట్టి ఆత్మజ్ఞానాన్ని త్వరలో పొంది, మానవుడు భవరోగాన్ని బాపుకొని ధన్యుడు కావాలి.

కావున ఓ మనస్సా! మహాదారుణమైన సంసారమను ఈ భయంకర వ్యాధిని బ్రహ్మజ్ఞానమను దివ్యౌషధముచే పోగొట్టుకొని పరమసుఖమును పొందు. పవిత్ర మానవ జీవితాన్ని సార్థకం చేసుకో. ○○



# వేదాంతగోష్ఠి

## నేటి చర్చనీయాంశము- తితిక్ష

**శిష్యుడు (శివప్రసాద్)**–మహాత్మా! గురుదేవా! మోక్షమునకు ఉపకరించు శమాదిషట్క సంపత్తియను '6' ముఖ్య సాధనలలో మొదటి మూడింటిని గూర్చి తమరిదివరలో సెలవిచ్చియున్నారు. ఇక నాల్గవది అయిన తితిక్ష అను సాధనమును గూర్చి వినాలనే కుతూహలం నాకు ప్రబలంగ వుంది. కాబట్టి దయచేసి దానిని గురించి విపులంగ తెలియజేయవేడుచున్నాను.

**గురువు (ప్రబోధానంద స్వాములవారు)**–నాయనా! శివప్రసాద్! ఎంతయో పూర్వపుణ్యము వుంటేనే ఈ జన్మలో పారమార్థిక విషయములందు జనులకు రుచి కలుగుతూంటుంది. కాబట్టి నీవు పుణ్యజీవి. ఆధ్యాత్మిక విషయములను తెలుసుకొనగోరు నీ జిజ్ఞాస ఎంతయో ప్రశంసనీయమైనది. నీవడిగిన దానిని చెప్పుచున్నాను. శ్రద్ధగ విను.

తితిక్ష అనగా ఓర్పు, సహనము. ఒక వ్యక్తియొక్క జీవితంలో ప్రారబ్ధానుసారం ఎన్నియో సుఖదుఃఖాలు, లాభనష్టాలు, మానవమానాలు సంభవిస్తూంటాయి. వీటినే 'వేదాంత పరిభాష'లో ద్వంద్వములు అని చెప్పుచుంటారు. సాధకుడైనవాడు ఇట్టి ద్వంద్వములకు ఏ మాత్రము లోబడియుండరాదు. "తుల్యనిన్దాస్తుతిః" అని గీతలో చెప్పినట్లు వారు ఈ ఒడిదుడుకులకు ఏ మాత్రము జంకక, సమస్థితిని కాపాడుకొనుచుండాలి. సుఖాలు కలిగినపుడు పొంగిపోకూడదు. దుఃఖాలు సంభవించినపుడు క్రుంగిపోరాదు. ఆధ్యాత్మిక సాధనలలో ఇట్టి సిద్ధాంతమును జ్ఞాపకమునందుంచుకొని ముముక్షువు తన చిత్తమునందు 'బ్యాలెన్సు'ను కలిగియుండాలి.

ఒక ఏనుగు పోతూంటే వెనుక కుక్కలు మొరిగినను, ఆ ఏనుగు ఏ మాత్రము జంకక, ధైర్యముతో ముందుకు వెళ్తూంటూంది. అట్లే ఉత్తముడైన సాధకుడు పర్వత స్థైర్యము అవలంబించి స్థితప్రజ్ఞుడై జీవితపథమున సంభవించు చిన్న చిన్న ఘటన

లకు ఏ మాత్రము లొంగక మోక్షమను గమ్యస్థానమునకు ఆనందంతో, ఉత్సాహంతో పయనమై పోతూండాలి. ఇదియే తితిక్ష యొక్క రహస్యం.

ఇట్టి తితిక్షను అవలంబించువాడు తన మనస్థైర్యమును కాపాడుకొని గంభీరంగ తన సాధనలను కొనసాగిస్తూంటాడు. అట్టి స్థైర్యము లేనివారు "అయ్యో! వాడు తిట్టాడే, వీడు కోపగించాడే, వాడు పోయినాడే" అని పలు విధముల శోకిస్తూ అమూల్యమైన జీవితాన్ని వృధాగా గడిపివేస్తూంటారు. అట్టివారి మనస్సు శోకాకులితమై యుంటుంది. కావున ముముక్షువైనవాడు ద్వంద్వములను ఏమాత్రము లెక్కించక, ధైర్యంగ, సమచిత్తంతో తన సాధనలను కొనసాగిస్తూ పోతూండాలి.

మానావమానములందు సమచిత్తమును కలిగియుండుటకు ఒక ఉపాయము చెప్తాను. విను– ఎవడైన తిట్టినచో దానిని విని కంగారుపడవలసిన పనిలేదు. ఆ తిట్టు కేవలం శబ్దతరంగం మాత్రమే ఔతుంది. మరియు వాడు తిట్టింది శరీరాన్నా లేక ఆత్మనా అని మనం ఆలోచించాలి. శరీరాన్నైతే అది మలమూత్రాదుల కొంప కాబట్టి తిట్టింపబడుటకు యోగ్యమే అని తలంచి శాంతపడాలి. ఒకవేళ వాడు తిట్టినది ఆత్మనే అని అనుకొంటే వాడి ఆత్మ, నా ఆత్మ ఒకటే కావున వాడు వానినే తిట్టుకుంటున్నట్లు ఔతుంది.

ఈ రోజు వాతావరణం వేడిగ వుండొచ్చు. రేపు చల్లగ వుండొచ్చు. ఈ రోజు సుఖం కలుగవచ్చు. రేపు దుఃఖం సంభవించవచ్చు. ఈ రోజు లాభం రావచ్చు. రేపు నష్టం కలుగవచ్చు. ఎట్టి పరిస్థితులందైనా సాధకుడు తన సమస్థితిని కోల్పోరాదు. ధైర్యాన్ని అవలంబించాలి. ఇదే తితిక్ష. దీనిని అభ్యసించటం వల్ల సాధకునకు ఎంతయో శాంతి చేకూరుతుంది. కాబట్టి శివప్రసాద్! నీవు కూడ పట్టుదలతో ఈ తితిక్షను సాధించి, సహనశీలుడవై జీవితమున పురోగమించు.

**శిష్యుడు–** గురుదేవా! ఆహాహా! ఎంత చక్కటి బోధ చేశారు. మానవుడు తరించటానికి ఇటువంటి సాధనలు చక్కగ ఉపకరిస్తాయి. తమరు బోధించిన ప్రకారం జీవితంలోని ఒడిదుడుకులను లెక్కచేయక సమస్థితిని కాపాడుకొని తితిక్షను సాధించుటకై యత్నిస్తా. సెలవు. ○○

Arise from the hypnotism of weakness.

దుర్బలత్వమును పారద్రోలి ధైర్యోపేతుడవై మెలగుము.



# మహర్షివాణి

## యోగవాసిష్ఠసారము

శ్రీ రామచంద్రునితో శ్రీ విశ్వామిత్రుడిట్లు పలికిరి. "ఓ రామా! నీ మానసిక వ్యధకు కారణమేమియో తెలియజేయుము. నీవు కోరునది నీకు లభింపగలదు. దానిచే నికనెన్నండును దుఃఖము నిన్ను వేధింపఁజాలదు" అది విని శ్రీరామచంద్రుడు ఖేదమును వీడి ధైర్యయుతుఁడై గంభీరముగ నిట్లు పలికెను.

"తీర్థయాత్రకు వెళ్లినప్పటి నుండియు నామనంబున ఈ యనిత్య సంసార దశను గూర్చిన చింతన యుద్భవించెను. 'భోగము లశాశ్వతములు. జీవిత మతి చంచలమైనది' అని యెఱుఁగుటచే పదార్థముల యెడల నాకరుచి జనించెను. నాకు రాజ్యమేల? భోగములేల? అంతయు మిథ్యయే. ధనమువలన, సంపదవలన ఏమియు ప్రయోజనము లేదు. అవి దుఃఖహేతువులే. ఆయువు అతి చంచలమైనది. అహంకారము సర్వానర్థములకును మూలము. చిత్తము బాహ్యవిషయజాలముపై దూకుచు, అతి చపలమై యున్నది. దానిని నిగ్రహించుట కష్టతరముగా తోచుచున్నది.

దోషములలో ప్రధానమైనది తృష్ణ. మహాత్ములద్దానిని వివేకమను ఖడ్గముచే ఛేదించివేయుదురు. అనేక క్లేశములచే వ్యాప్తమై వార్ధక్యాదులతో కూడిన నిందితమగు శరీరమునందు విశ్వాసముంచఁదగదు. బాల్యావస్థ మహాదుఃఖ సంయుతమైనది. అట్లే యవ్వనము రాగద్వేష కామక్రోధాదులకు నెలవై యొప్పుచున్నది. అనేక రోగములతోను శోకమోహచింతాదులతోను, అశక్తతతోను గూడిన వార్ధక్యము దుఃఖహేతువే అయియున్నది. ప్రపంచమందలి సమస్తపదార్థములను, బ్రహ్మాండములను కూడ కాలము గ్రహించి వైచుచున్నది. అనేక ఆపదలతో గూడి అస్థిరమై, మోహప్రదమైనట్టి ఈ సంసార దశయందుఁబడి అజ్ఞానులగు జనులు పరమార్థము నెఱుఁగక దుఃఖ పరవశులగుచున్నారు.

జగత్తు కేవలము పంచభూతములయొక్క వికారమే. ఇందు సారము లేదు. నశ్వరమైన ఈ ప్రాపంచిక దశలందు మూఢులు మాత్రమే ప్రీతిని గొనుదురు. ఈ జగత్తునందు స్థిరమైన వస్తువేదియు లేదు. సమస్తము విపర్యయము (మార్పు) నొందుచున్నది. ఇట్టి దానియందు విజ్ఞులకు విశ్వాసమెట్లు కలుగును.

ఈ ప్రకారముగ సాంసారిక పదార్థములందలి దోషదృష్టిచే నామనంబున భోగములఁ గూర్చిన యాశ క్షీణించినది. ఇక నాకు రాజ్యమేల? ధనములేల? వైభవములేల? నాకు మనశ్శాంతి లభించి శాశ్వతమై, నిరతిశయానంద స్వరూపమై, దుఃఖరహితమైనట్టి స్థితి కలుగగలందులకై యుపాయము చెప్పవేడెద. అట్టి విశ్రాంతి పదమును నేను బొందకున్నచో, ఇక భోజనాదులను విసర్జించి ఈ శరీరమును దృజించి వైచెదను"

శ్రీరామచంద్రుని ముఖతః వెలువడిన ఇట్టి వైరాగ్యపూరిత వచనములను విని సభ్యులెల్లరు ఆనందభరితులైరి. సిద్ధగంధర్వాదులు సంతోషాతిరేకముచేఁ బుష్పవృష్టి కురిపించి తామట్టి యుత్తమ వచనముల నిదివరకెన్నడునువినలేదని చెప్పిరి.

మఱియు ఆతని కాత్మజ్ఞానోపదేశము చేయునిమిత్తము వసిష్ఠమహర్షి వచింపనున్న మహాబోధ నాకర్ణించుటకై యాసభకేతెంచవలసినదిగా మునులను, మహర్షులను అందఱిని గోరిరి. ఆ సిద్ధుల వాక్యములను విని యనేక మహర్షులటకేతెంచిరి. అత్తఱి యా సభలో విశ్వామిత్ర నారద వ్యాస వాల్మీకి భృగు అంగిర పులస్త్య పులహ చ్యవన ఉద్దాలక ఉశీర శరలోమ వామదేవ మరీచ దుర్వాస క్రతు వాత్స్యాయన భరద్వాజ శర్యాతి ఋచీకాది మునిపుంగవులును, ఇంకను అనేక బ్రహ్మనిష్ఠులును గలరు.

అపుడు వసిష్ఠ విశ్వామిత్ర నారదాదులిట్లు చెప్పిరి– "శ్రీరామచంద్రుడుత్తమమైన వాక్యములఁబలికెను. రామచంద్రునివంటి ధీశాలురు ఈ ప్రపంచమున చాల అరుదుగ గానవచ్చుదురు. ఇపుడితనికి మన మాత్మజ్ఞానమును గలిగింపకున్నచో మనము జ్ఞానులమై యుండుట వ్యర్థమేయగును". ○○

The                    is only the self with variations.

వికారయుక్తమగు ఈ ప్రపంచమంతయు ఆత్మయందు

ది.

# భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి

## శాశ్వతసభ్యులు (Life Members)

శ్రీ కాళహస్తియందలి శ్రీ శుకబ్రహ్మాశ్రమమునందు నూతనముగ నిర్మింపబడిన భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రికి శాశ్వత సభ్యులుగ చేరిన భక్తుల పేర్లు ఈ క్రింద తెలుపబడినవి.

శాశ్వత సభ్యత్వ విరాళము రూ.11,116 లు.

---

ఈ పైకము బ్యాంకునందు ఫిక్స్డ్ డిపాజిట్‌గా వుంచబడి దానిపై వచ్చు వడ్డీతో సంవత్సరమునకు ఒకరోజు దాత పేరుతోగాని, వారి తల్లి దండ్రుల పేరుతోగాని ఆస్పత్రిలో వైద్యసేవ గావింపబడును. రోగులకు భోజనాది సదుపాయములు కూడా ఏర్పాటుచేయబడును.

## ఉచిత కంటి ఆస్పత్రి శాశ్వతసభ్యులు

1. శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు – హైదరాబాద్
2. శ్రీ డి. సీతారామయ్య గారు – హైదరాబాద్
3. శ్రీ జి.ఎస్. రాజు గారు – విజయవాడ
4. శ్రీ టి. యోగయ్యనాయుడు గారు – హైదరాబాద్
5. శ్రీ జి. శివయ్య గారు – హైదరాబాద్
6. శ్రీ బి. శ్రవణ్‌కుమార్ గారు – హైదరాబాద్
7. శ్రీ డా॥ టి.బి.జి. తిలక్ గారు – హైదరాబాద్
8. శ్రీ శేషన్న చెన్నావార్ గారు – హైదరాబాద్
9. శ్రీ కల్లూరు రాధాకృష్ణయ్య గారు – కల్లూరు
10. శ్రీ ఆత్మకూరు నాగభూషణం శెట్టి గారు – నంద్యాల
11. శ్రీ ఆర్. రామసుబ్బారెడ్డి గారు – హైదరాబాద్
12. శ్రీ జి. సుబ్బారెడ్డి గారు – నంద్యాల
13. శ్రీ భీమవరపు రామిరెడ్డి గారు – నంద్యాల

14. శ్రీ మాఘం పుల్లయ్య గారు – నంద్యాల
15. శ్రీ వేదా రామనర్సయ్య గారు – మెదక్
16. శ్రీ సర్వా సత్యనారాయణ గారు – హైదరాబాద్
17. శ్రీ జి. బుచ్చయ్య గారు – హైదరాబాద్
18. శ్రీ టి.వి. దేవేందర్‌రావు గారు – సికింద్రాబాద్
19. శ్రీ జె. రామ్‌రెడ్డి గారు – హైదరాబాద్
20. శ్రీ పొన్నేరి చంద్రశేఖరమ్ గారు – మద్రాసు
21. శ్రీ కె. శివశంకర్ గారు – హైదరాబాద్

రాబోవు సంచికలో మరికొన్ని పేర్లు ప్రకటించబడగలవు. శాశ్వత సభ్యులుగ చేరదలంచువారు పైకమును డ్రాఫ్టు మూలకముగ ఈ క్రింది అడ్రస్సుకు రిజిష్టరు పోస్టు ద్వారా పంపవచ్చును.

, శ్రీ శుకబ్రహ్మాశ్రమము–517 640
శ్రీ కాళహస్తి, చిత్తూరు జిల్లా (ఆం.ప్ర.)
Phones : Off. 2239 Res. 2543 STD Code 08578

# వేదాంతభేరి శాశ్వత చందాదారులు
## (Life Members)

వేదాంతభేరి మాసపత్రికకు నూతనముగ చేరిన శాశ్వత చందాదారుల పేర్లు :–

శాశ్వత చందా రు.

1. శ్రీ పి. వేంకటేశ్వరరావు గారు – నిజామాబాద్
2. శ్రీ పి. ప్రమీల గారు – నిర్మల్
3. ఆధ్యాత్మిక గ్రంథాలయం – వరంగల్
4. శ్రీ కె. వేంకటేశమ్ గారు – సికింద్రాబాద్ OO

## మీకు తెలుసా?

### 1. అష్ట ద్రవ్యములు–

(పూజకు ఉపయోగపడు పదార్థములు ఎనిమిది)1. తేనె,2. పెరుగు, 3. నెయ్యి, 4. అక్షతలు, 5. నువ్వులు, 6. గఱిక, 7. దర్భ, 8. పుష్పములు.

### 2. మర్కట కిశోర న్యాయము–

భక్తుడు భగవత్ప్రాప్తికై జ్ఞాన, యోగ, తపస్సులను గావించు పద్ధతి. కోతిపిల్ల స్వశక్తిచే తల్లి కోతిని గట్టిగ పట్టుకొనియుండునట్లు, మానవుడు ప్రయత్న పూర్వకముగ భగవంతుని పొందగోరుట.

1. రుక్మిణి, 2. సత్యభామ, 3. జాంబవతి, 4. మిత్రవింద, 5. భద్ర, 6. సుదంత, 7. కాళింది, 8. లక్షణ.

### 4. ఏకదండి–

ఎ. బాహ్యార్థము– ఒక దండము (కర్ర) కలవాడు.

బి. అంతరార్థము– ఆత్మజ్ఞానము అను ఏకదండమును దాల్చి పరమాత్మ యందు ధారణాబుద్ధి కలవాడు.

### 5. ఓంకారమునకు పర్యాయపదములు–

1. ప్రణవము, 2. సర్వవ్యాపి, 3. అనంతము, 4. తారము, 5. సూక్ష్మము, 6. శుక్లము, 7. వైద్యుతము, 8. పరబ్రహ్మము, 9. తారకము, 10. ప్రళయము, 11. బ్రహ్మము, 12. ప్రకాశము, 13. విద్యుత్తు, 14. మహాదేవుడు, 15. తురీయము, 16. కారణము, 17. ఏకము, 18. ప్రత్యక్కు, 19. భగవన్, 20. శాంతమూలము, 21. మహాలక్ష్మి, 22. మహామాయ, 23. మహాదేవి, 24. మహాసరస్వతి, 25. సూత్రము, 26. ఉద్గీథము, 27. ఏకాక్షరము, 28. మూలమంత్రము.

OO

Printed and Published by **Vemuri Balaram** for Sri Sukabrahma Ashram, Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada
**Editor : B. ESWAR**

******

# నారద భక్తి సూత్రములు–75

## బాహుళ్యావకాశాదనియతత్వాచ్చ.

*తా॥* వాదవివాదములు పెరుగుచునేపోవును. వాటికి ఒక హద్దు అనునది లేదు. కాబట్టి భక్తుడు వాటిలో పాల్గొనరాదు.

వ్యాఖ్య :– క్రిందటి సూత్రములో భక్తుడు వాదవివాదములలో, తర్కవితర్కములలో తలదూర్చరాదని చెప్పబడినది. అట్లెందుకు వాటిలో పాల్గొనరాదో ఈ సూత్రమందు తెలియజేయబడినది. వాదములకు, తర్కములకు అంతువుండదు. హద్దు, పద్దులేని అట్టివాటిని ఆశ్రయించినచో భక్తునకు సమయము వృథాగా గడచిపోవును. భగవంతుని పాదపద్మములయందు నెలకొల్పవలసిన మనస్సును తర్కాదులవైపు మరలనీయక భక్తుడు కడు జాగరూకుడై యుండవలెను.

కాలము అతి ముఖ్యమైనది. జీవితము స్వల్పమైనది. ఇట్టి పరిస్థితిలో విజ్ఞుడగువాడు దైవభక్తిని పెంపొందింప జేసికొనుటకే యత్నింపవలెనే కాని బహిర్ముఖ వృత్తులలో నాశనము చేయరాదు. పూర్వపక్ష ప్రతిపక్షములతో కాలమును వ్యర్థముచేయక అద్దానిని నిరంతర దైవస్మరణ, దైవచింతన, దైవధ్యానాదులందే వినియోగించవలెను. ఈ సూత్రమందు, క్రిందటి సూత్రమందు తెలుపబడిన హెచ్చరికను భక్తుడు జాగ్రతగ గమనించి, ఆ ప్రకారముగ వాదవివాదములను విరమించి సతతము భగవద్ధ్యానపరుడై విలసిల్లవలెను.

ఓం

******